## కృతజ్ఞతాంజలి

భరతబాల శతకానికి ముందుమాట వ్రాసివ్వండని కోరగానే శిష్య వాత్సల్యంతో నన్ననుగ్రహించి 'పూర్వరంగం' పేర ఆశీస్సులందించిన అధికార భాషా సంఘం పూర్వాధ్యక్షులు, పూజ్యులు డా॥ నండూరి రామకృష్ణమాచార్య గారికి, అభినందన లందించిన గురువర్యులు ఆచార్య ఎస్.వి. రామారావు గారికి, 'పద్యానికి నడక ప్రాణం' అనే శీర్షికతో ఆకాంక్ష లందించిన గురుతుల్యులు ఆచార్య ఎన్. గోపి గారికి, ఈ శతకం చదివి తగిన సలహాలనిచ్చి ముద్రించుమని ప్రోత్సహించిన గురుతుల్యులు, ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి గార్లకు నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

ఈ శతక ముద్రణకు ఆర్థికంగా సహకరించిన వదాన్యులు, శ్రేయోభిలాషులు శ్రీమతి & శ్రీ దేవినేని సీతారామయ్య గార్లకు మరియు శ్రీమతి & శ్రీ రామగిరి యమునా మాధవరావు గార్లకు నా మనఃపూర్వక నమస్సుమాంజలులు.

ఈ పుస్తకానికి చక్కని ముఖపత్రం వ్రాసియిచ్చిన ఆత్మీయులు శ్రీ ప్రతికంఠం సీతారామరాజు గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ వారికి - అందరికీ నా కృతజ్ఞతాభివందనములు.

మీ

**వడ్లూరి ఆంజనేయరాజు**

5-5-1995

# భరత బాల

(శతకం)



**డా॥ వడ్లూరి ఆంజనేయరాజు**



మాతృవత్సల ప్రచురణలు

భాగ్యనగర్. (ఆం.ప్ర)

# భరతబాల

(శతకం)

రచన :

**డా॥ వడ్లూరి ఆంజనేయరాజు**

ప్రచురణ :

**మాతృవత్సల ప్రచురణలు**

భాగ్యనగర్ (ఆం.ప్ర.)

భరతబాల శతకం

డా॥ వఝ్ఝారి ఆంజనేయరాజు

ప్రథమ ముద్రణ : ఏప్రిల్/మే, 1995

ప్రతులు : 1,000

మూల్యం : రూ. 6.00

మాతృవత్సల ప్రచురణల సంఖ్య - 5.

ప్రతులకు :

గాయత్రి పబ్లిషర్స్ & బుక్ సెల్లర్స్
ఆంధ్ర సారస్వత పరిషత్ బిల్డింగ్
తిలక్ రోడ్, హైదరాబాద్,
ఫోన్ : 592762

లేజర్ టైప్‌సెట్టింగ్ :

లక్ష్మి గ్రాఫిక్స్,
2-1-476, నల్లకుంట, హైదరాబాద్.

ముద్రణ :

కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
40, ఎ.పి.హెచ్.బి. బ్లాక్స్, విద్యానగర్, హైదరాబాద్. ఫోన్ : 618261.

# అంకితం

భరతమాత పరమ పావనోత్సంగము
చేరి యాటలాడి చెంగలింప
నా మనస్సునందు నవతరించిన బాల
భరతబాల నిడుదు భక్తిమీర

# పూర్వరంగం

**– నండూరి రామకృష్ణమాచార్య**

1

శ్రీ ఆంజనేయరాజు ఇంతఃపూర్వమే 'చొక్కనాథచరిత్ర - సమగ్ర పరిశీలన' వ్రాసి డాక్టరేటు పట్టాభిషిక్తుడైనాడు.. శ్రీ ఆంజనేయ శతకము, శ్రీ సత్యసాయి శతకము, మధుమురళి కృతులు చక్కని చిక్కని శైలిలో వ్రాసి కీర్తిప్రతిష్టలు ఆర్జించియున్నాడు. శ్రీ ఆంజనేయరాజు కవితలకు బలము కలిగి బరువులేని తేటతెలుగు నుడికారపు ఒంపుసొంపులు విశిష్టతను చేకూర్చుచున్నవి. మధుమురళి లోని లలిత గీతాలు కవి ఎంతటి మెత్తని గుండె కలవాడో సదా కవిత పొంగిపొరలే హృదయము కలవాడో స్వయం వ్యక్తం చేస్తాయి. ఆ కృతిలోని పాటలు అన్నీ సంగీత సాహితీ సంగమ క్షేత్రాలు. ఈ కృతి కవి శ్రీకృష్ణునకు అంకితం ఇచ్చాడు. హృదయంగమమైన ఆ అంకిత పద్యం ఇచట ఉదహరింపదగినది.

"పిల్లగ్రోవి నూది వల్లవ యువతుల
పరవశింపజేయు పాటగాని
ఎఱ్ఱని పెదవులకు - ఈ మధుమురళిని
క్రొత్త కాన్క చేసి యిత్తునేను

2

శ్రీ ఆంజనేయరాజ కవి ప్రకృతము వ్రాసిన కృతి భరతబాల శతకము. తెలుగు ఛందస్సులో ఆటవెలదికి గల విశిష్టత పద్య కవితా ప్రియులందరకు అనుభవామ్రేడితము. వేమన చేతిలో ఆటవెలది సిద్ధి పొందింది. తెలుగు ఛందస్సు శ్రవణ పేయతలో సంస్కృతమును మించిన సంగతి వేత్తలకు తెలియనిది కాదు. అలనాడు కర్ణుడు సహజ కవచకుండలాలతో ఉద్భవించినట్లు పురాణ కథనం. తెలుగు పద్యం సాహితీ కవచ కుండలాలు అనదగిన యతి ప్రాసలతో సద్యోయౌవనంతో సారస్వత జగత్తులో అవతరించింది. అసలు ఏది తెలుగు పద్యం? వృత్తం కవుల సత్తాకు నికషోపలం. కందము వ్రాయనివాడు కవే కాడు అని తెలుగు నానుడి.

అయితే వేమన ఇటు తెలుగు ఛందస్సును పాటించాడు. సంస్కృతంలో యతి అంటే విరతి, విశ్రాంతి. అటు సంస్కృత యతిని పాటించాడు. ఆవిధంగా ఆటవెలది నూటికి నూరుపాళ్లు తెలుగు ఆడపడుచుగా ఆహార్యం సంతరించుకుంది.

"ఆటవెలదిలోని యమకమ్ము గమకమ్ము
తేట తెలుగు నుడుల తీయదనము
హొయలు లయలు నడల ఒయ్యారములు వడుల్
వీనుదోయికెపుడు విందుగొలుపు"

తెలుగుదనము నూటికి నూరుపాళ్లు ఉట్టిపడే ఆటవెలది పద్యాలలో శతకం వ్రాసిన శ్రీ ఆంజనేయరాజునకు నా జేజేలు.

3

ఇక ఇతివృత్తమా ఇది శతకం. 'భవ్య సుగుణశీల భరతబాల' అనే మకుటం తప్ప ఇందులో ప్రతి పద్యము స్వయంసంపూర్ణమైన సర్వతోముఖ సమగ్రమైన చాటువే. భరతబాల శతకము సమకాలీన సమాజము ప్రతిఫలించుచున్న నిలువుటద్దాల మేడ. దీనికి ఈ శతకమంతయూ ఉదాహరణమే.

"బాల కార్మికులను పనియందు నియమింప
వలదటనుచు బలుక ఫలముదేమి?
కూడు గుడ్డలున్న కూలికెందుకు బోవు
భవ్య సుగుణశీల భరతబాల" (పద్యం నెం. 54)

అలతి అలతి మాటలతో కాహళ సంధించినట్లుగా కవిత చెప్పవలెనని తిక్కన నిర్దేశం. 'కవిత చెప్పి ఉభయకవిమిత్రు మెప్పింప' బ్రహ్మకైన అలవి కాదని కేతన ఉవాచ. శ్రీ ఆంజనేయరాజు కవిత తిక్కనగారు వింటే తప్పకుండా తల యూచగలడని నా అభిప్రాయం.

4

ఒక విన్నపము :

ఆటవెలది లక్షణం – "ఇనగణత్రయంబు నింద్రద్వయంబును హంస పంచకంబు నాటవెలది" అందరకు తెలిసినట్టిదే. ఐతే సూర్యగణములు రెండును

మూడుమాత్రలే కాని ఇంద్రగణములు కొన్ని చతుర్మాత్రా గణములు కొన్ని పంచ మాత్రా గణములు. నా సూచన - చతుర్మాత్రా గణములను వర్తమాన, భవిష్యత్కవులు ఆటవెలదిలో పరిహరించడం మంచిది. అప్పుడు ఆటవెలది నడకలో కుంటుపడదు.

5

చివరిమాట :

ఈ కావ్యం ముద్రణకు ఆర్థిక సహాయం అందించిన ప్రియమిత్రులు శ్రీ దేవినేని సీతారామయ్య గారి సహృదయత, సౌజన్యము, వ్యక్తిత్వ మాధుర్యం నాకు అనుభూతపూర్వములే. తెలుగువారు కవితా ప్రియులు. కవులను యుగయుగాంత రాలలో తెలుగు సహృదయులు ఘనసార కస్తూరికా తాంబూలములతో, రత్నాంబరాలతో, హేమపాత్రాన్నాలతో, కనకాభిషేకాలతో సత్కరిస్తూనే ఉన్నారు. ఇది తెలుగు సంస్కృతికి గర్వకారణం.

డా॥ వడ్లూరి ఆంజనేయరాజు నలువదేండ్లు దాటని యువకుడు. భవిష్యత్కాలములో ఇంతకంటే కూడ గొప్ప కావ్యాలు రచించగలడని ఆశిస్తూ ఆశీర్వదించుచున్నాను. పద్యకవిత తెలుగులో నవనవోన్మేషముగా సదా వర్ధిల్ల గలదు అనే నా ఆశాభావమునకు డా॥ వడ్లూరి ఆంజనేయరాజు జీవదుదాహరణం.

"కోరి గుండెలోన గుడికట్టుకున్నాడు
'భరతబాల' కొరకు భక్తిమీర
కవిత పొంగి పొరలు కైవారముగ మార్చె
నీతిశతక మాంజనేయరాజు"

1-8-76, పి.జి. రోడ్డు
35, జవహరునగర్,
సికిందరాబాదు - 500 003.
ఫోన్ : 817397
యువ ఉగాది
1-4-1995

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**
అధ్యక్షుడు
ఆంధ్ర పద్యకవితా సదస్సు

ఓం శ్రీ సాయిరాం

**ఆచార్య ఎస్వీ రామారావు**
తెలుగు విభాగం
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# అభినందన

ఆంజనేయరాజు 'మధుమురళి'కి పల్లవి పలుకుతూ సామాజిక స్పందనతో కూడిన రచనలు వెలువరించాలని ఆకాంక్షించాను. 'భరతబాల' రచనతో నా కోరిక తీర్చినందుకు అతణ్ణి అభినందిస్తున్నాను. నిజానికి సామాజిక స్పృహ లేని కవి వుండడు. అయితే సమకాలీనతలో సార్వకాలీనతను దర్శించటం ఆదర్శనీయుడైన కవి సాధించే సత్ఫలం.

'భరతబాల' శతకంలో సార్వజనీనమైన సత్యాలు గోచరిస్తాయి. అవినీతి, స్వార్థం, హింస పెచ్చుపెరిగిపోతున్న వర్తమాన సమాజ స్థితిని ఖండిస్తూ తీవ్రంగా స్పందిస్తాడు ఈ కవి.

"పరుల సొమ్ము దోచు పాపాత్ములీనాడు
అధికమైరి లోకమందు జూడ
ధర్మదెట్లు వారి దయజూచునో మరి" 31

"పదవుల పయి మోహమధికముగా హెచ్చి
ఎదటివారి మదికి సొదను గూర్చు
చల్దిదిన్న మగడు సతియాక లెరుగునా" 7

ఈ రోజుల్లో ఎటు చూసినా కల్తీయే గోచరిస్తుంది. ముఖ్యంగా భావ కాలుష్యం అతిగా వ్యాప్తమవుతున్నది.

"భాషయందు కలితి భావముతో కల్తి
బ్రతుకులందు కలితి వ్రతము కల్తి
కలితి లేని తావు కలియుగమున లేదు" 27

అని వచిస్తాడు.

కుల మతాల వైషమ్యాలు సరేసరి. అనైక్యతా భావంతో మన జాతి పతనమవుతున్నది -

"చదువులెన్ని జదివి శాస్త్రార్థమెరిగియు
కులము కంపు వదలరేల బుధులు
మొగలి పొదల పొంత నాగములున్నట్లు" 12

అని వాపోతాడు.

ఈ అనర్థాలన్నిటికీ కారణం మనిషి స్వ స్వరూపాన్ని గుర్తించలేక ఆత్మ పరిశీలన చేసుకోలేక పోవటమే అన్న సత్యాన్ని ఇలా వెల్లడిస్తాడు -

"మట్టికుండ వంటి మానవ దేహమున్
నమ్మి మానవుండు నాశమౌను
ఎట్టులైన తనువు కట్టెల పాలౌను" 21

చక్కని లోకోక్తులతో నానుడులతో సరళమైన ఆటవెలది శైలిలో కొనసాగిందీ శతకం.

"భావమునకు తగిన భాషను సమకూర్చి
పదములందు లలిత భావముంచి
సరస హృదయులకును సంతోషమును గూర్చు"

ఆంజనేయ కవికి నా అభినందనలు.

ఎస్వీ రామారావు

సికింద్రాబాద్

తే. 5-4-1995

ఆచార్య ఎన్. గోపి
అధ్యక్షులు - తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# పద్యానికి నడక ప్రాణం

డాక్టర్ ఆంజనేయరాజు తన తాజా శతకానికి ఓ రెండు మాటలు రాయమంటే ఇతరత్రా కార్యవ్యగ్రత వల్ల చాలా ఆలస్యం చేశాను. నా నిస్సహాయతను చిరునవ్వులతో అర్థం చేసుకున్న డా॥ రాజు మంచితనానికి సంతోషిస్తున్నాను. నిజానికి ఇందులోని పద్యాలు చేతికందగానే చదివేశాను. కొన్ని పంక్తులు వెంటనే గుండెని తట్టాయి కూడా. ప్రవహిస్తున్న వర్తమాన ప్రవాహంలోని అలలను డా॥ రాజు లోచూపుతో ఒడుపుగా పట్టుకొని సమాజపరంగా వ్యాఖ్యానిస్తున్నాడు. దీనికి ఆయన ఎన్నుకున్న మాధ్యమం ఆటవెలది పద్యం. ఆటవెలది పద్యాల్లో ఆయన ఇంతకుముందే కొన్ని శతకాలను రచించాడు. అవన్నీ కూడా చక్కని ధారతో ధారాళంగా నడుస్తాయి. నిజానికి నడకే పద్యానికి ప్రాణం. పద్యంలో లెక్కకు గణాలన్నీ కలిసినా, వాటికొక సొగసైన నడక లేకపోతే అది వొట్టి ఛందస్సుల పుట్టగా మిగిలిపోతుంది. నడక బాగా ఉన్న పద్యాలే గళగ్రహణ యోగ్యతను సంతరించుకుంటాయి. నోటికెక్కుతాయి. నోటికెక్కడానికి ఆ పద్యాల్లో దానికి కారణమయిన ధారణానుకూల శిల్పమేదో నిక్షిప్తమై వుంటుంది. ఒక పద్యం హృదయాకర్షకంగా ఉండి మనస్సుకి హత్తుకోవడానికి వస్తువు, రూపం, తుల్య ప్రాధాన్యం వహిస్తాయి. మొదట ఆటవెలది నిర్మాణాన్ని గురించి కొంత పరిశీలన చేస్తాను. ఆటవెలది ఉపజాతి విభాగంలో చేరుతుందని మనందరికీ తెలుసు. వృత్తాల్లో గురు, లఘు క్రమం, అక్షర సంఖ్యా నిర్దిష్టంగా వుంటాయి. ఇక జాతి పద్యాల (ఉపజాతులు కూడా) నిర్మాణం మాత్రం సంఖ్యతో ఏర్పడ్డ గణాల మీద ఆధారపడి ఉంటుంది. వీటిని మాత్రా గణాలంటారు. మాత్రాగణాలలో గురు లఘువులను మార్పుచేసే వీలుంది. మాత్రాగణాల క్రమానికి కొన్ని రకాల గురు లఘుక్రమాలను సహించే వీలుంది. అంటే లక్షణంలోనే పద్య పరిమాణాన్ని

మించిన గణాలు ఇవ్వబడ్డాయి. కాబట్టి వాటిలోనుండి అవసరమైన గణాలను ఏరుకొని వాడుకొనే సుళువు జాతులలో వుంది. కాబట్టి వృత్త రచనలో లేని సౌలభ్యం జాతులకుంది. ఈ కారణం వల్లనే ఆంగ్లంలో ఛందఃశాస్త్రం రచించిన సి.పి. బ్రౌన్ వృత్తాలను 'Fixed meters' or 'Uniform meters' అనీ జాతులను 'Changing meters' అనీ పిలిచాడు. ఆటవెలది లక్షణం మనకు తెలిసిందే!

"ఇనగణత్రయంబు ఇంద్రద్వయంబును
హంస పంచకంబు ఆటవెలది"

ఆటవెలదిలో నాలుగు పాదాలుంటాయి. దీనిలో 1, 3 పాదాలకొక లక్షణం, 2, 4 పాదాలకొక లక్షణం ఉంటాయి. కాబట్టి 1, 2 పాదాలకు లక్షణం చెప్తే మొత్తం పద్యానికి చెప్పినట్టవుతుంది. మొదటి పాదంలో క్రమంగా 3 సూర్యగణాలు, 2 ఇంద్రగణాలు ఉండాలి. 2వ పాదంలో 5 సూర్యగణాలుండాలి. రెండు పాదాల్లో కూడా మొదటి గణం ప్రథమ అక్షరానికి, నాలుగవ గణం ప్రథమ అక్షరానికి యతి చెయ్యాలి. ప్రాస యతి నియమం కూడా ఉంది.

ఆటవెలదికి నియమించిన ఆరు ఇంద్రగణాలలో మూడు (భ, ర, త లు) వృత్తాలలోని త్ర్యక్షర గణాల నుండి స్వీకరించినవే. ఇక మిగిలిన మూడు నల, నగ, సలలు. ఇవి అక్షర గణాలలోని 'న' గణానికి వరుసగా లఘువు, గురువు మరియు 'స' గణానికి లఘువు చేర్చగా ఏర్పడ్డాయి.

మాత్రల దృష్టితో ఆటవెలది పాదం పొడవు 19 మాత్రల్ని మించదు. 17 మాత్రలకన్నా తగ్గదు. రెండవ పాదం పొడవు 15 మాత్రలు. దీని పొడవు స్థిరము. అంటే ఆటవెలది పద్యంలో మొత్తం మాత్రల సంఖ్య 68కి మించదు. 65 మాత్రల కన్నా తగ్గదు.

గురు లఘువుల నియతక్రమం వల్ల పద్యానికి లయ లేక తూగు ఏర్పడుతుంది. గురు లఘువుల మధ్య ఒకానొక తూకం కుదిరినప్పుడు పద్యం నడక బాగుందనిపిస్తుంది. ఆటవెలదిలోని పొట్టి (2, 4) పొడుగు (1, 3) పాదాల వలన సిద్ధించే గమన వైవిధ్యం శ్రుతి సుభగంగా ఉంటుంది. ఆటవెలది ప్రథమ భాగంలో ఒకే గురువుని పెట్టి మిగతావన్నీ లఘువులే ఉంచి కూడా అల్లవచ్చు. ఒక గురువు వున్నప్పుడు, లఘువులు 15, 16 దాకా వుంటాయి. ఇది నిజంగా పరుగే కాని నాట్యం కాదు. సమతూకం లోపించి నడకవల్ల చేకూరే శ్రవణ సుఖం దీనివల్ల రాదు.

ఆటవెలదిలోని మెళకువలన్నీ మొదటి పాదంలో చూపెట్టడానికే ఎక్కువ అవకాశం ఉంటుంది. లక్షణం చెడగొట్టకుండా అనేక వేల గణక్రమాలతో (Combinations) అసంఖ్యాకమైన గతి భేదాలను సాధించవచ్చు.

అన్ని భాషలలో కూడా పదగతాలైన అక్షరాలమీద, ఊనిక (accent) ఉంటుంది. సాధారణంగా ఈ ఊనికకు పదాలు లేదా పదఖండాల (కుండ వంటివి - 21) ప్రారంభాలను సూచిస్తాయి. ఊనికవల్ల ఉచ్చారణ కొక శ్రుతి సౌఖ్యం ఏర్పడుతుంది. వాటి స్థానాలను ఈ కిందివిధంగా గుర్తించవచ్చు.

1. పదాద్యక్షరం మీద సాధారణంగా ఊనిక వుంటుంది. 2. గుర్వక్షరాల మీద కూడ ఊనిక ఉంటుంది. 3. పదం మొదటి అక్షరం లఘువై, రెండవ అక్షరం గురువైతే ఊనిక రెండవ అక్షరం మీదనే ఉంటుంది. 4. గుర్వక్షరం లోని రెండు మాత్రల్లో మొదటి మాత్రమీదనే ఊనిక ఉంటుంది.

పదాల మార్పుకు సంబంధించి పద్యగతి యొక్క విశిష్టత ఈ ఊనికల మీదనే ఆధారపడి వుంటుంది. శ్రవ్యదృష్టి గల కవి పద్యపాదంలోని మొత్తం మాత్రల్లో ఏమాత్ర మీద ఊనిక వుండాలో, దేనిమీద ఉండకూడదో, ఏ స్థానంలో ఐచ్ఛికమో నిర్ణయించుకుంటాడు. (దీనికి సంబంధించిన మరిన్ని వివరాల కోసం గిడుగు సీతాపతి గారు రచించి 'పద్యరచన' అనే వ్యాసం చూడవచ్చు).

భరతబాల శతకంలోని ఒక పద్యానికి పై లక్షణాలను సమన్వయం చేసి చూద్దాం.

నటన పేర సన్నసైన వస్త్రము గట్టి

పై పాదం లోని 1, 4, 7, 10, 13, 17 మాత్రలమీద ఊనికలున్నాయి. సాధారణంగా 16, 17 మాత్రలపైన ఉండే చివరి ఊనిక శ్రవణ సుఖాన్ని కలిగిస్తుంది. ఈ ఊనిక ఉండే గణం సలము ( I I U I ). సగణానికి తర్వాత లఘువు చేరిస్తే సలము అవుతుందని లాక్షణికులు చెప్తారు. కాని ఇంగ్లీషు వారి

కోసం ఛందఃశాస్త్రం వ్రాసిన సి.పి. బ్రౌన్ జగణానికి ముందు లఘువు చేరిస్తే 'సలము' ఏర్పడిందని భావించాడు. అందుకే దీనికి లజం (I I U I) అని పేరు పెట్టాడు. కాని దీనిలో జగణస్ఫూర్తికి గాని జగన భ్రాంతికి గాని అవకాశం లేదు.

ఈ ఛందః చర్చ ఇంతటితో ఆపేస్తాను. ఆంజనేయరాజుకు ఆటవెలది అంటే ఇష్టమని అనిపించడం వల్ల, నాక్కూడా ఆటవెలది అభిమాన ఛందము కావడం వల్ల రాజు నుండి ఇంతకంటే మంచి నడక గల పద్య రచనను ముందుముందు ఆశించడం వల్ల ఇంతవరకు లాగాను. ఈ శతకంలోని 120 పద్యాల్లో వర్తమాన లోకరీతులు ప్రతిబింబించాయి. దేహమందు వెలుగు దివ్యాత్మకులమేది (20) వంటి పాదాల్లో వేమనను తలపిస్తాడు.

"నేతల పథకాలు నింగిపూలయ్యేను"
"పిండి కొలది రొట్టె వెండికొలది నగ"
"వైద్యశాలలిట్లు వధ్యశాలలునయ్యె"
"యూనివర్సిటీలు ఖూనివర్సిటిలయ్యె"

వంటి పాదాల్లో చేయితిరిగినతనం కన్పిస్తుంది. స్వతహాగా ఆంజనేయ రాజు మానవతావాది.

ఆంజనేయరాజు - ఆటవెలదులందు
చెప్పినట్టి మాట చెవినిబెట్టి
దానవత్వమణచి మానవత్వముపెంచు
భవ్య సుగుణశీల భరతబాల

యతి ప్రాస ప్రయోగాల్లో ఏదో ఫరవాలేదు అనే కిట్టింపులను పరిహరిస్తూ మరింత సొగసైన పద్యాలు రాయాలని ఆశిస్తూ ఉత్తరోత్తరా రాజు అభివృద్ధిని ఆకాంక్షిస్తున్నాను.

హైదరాబాదు
4-5-1995

ఎన్. గోపి

# భరతబాల

1. భరతబాల నిన్ను భావించి నెమ్మది
ముక్తక శతిఁజెప్పఁబూనుకొంటి
నాదరించు దీని నతి భక్తితోడను
భవ్య సుగుణశీల భరతబాల.

2. లలిత భావములను లక్షణయుతముగ
అలతి యలతి పదము లందుఁగూర్చి
ఆటవెలదులందు నందింతు ప్రియమున
భవ్య సుగుణశీల భరతబాల.

3. భావమునకు తగిన భాషను సమకూర్చి
పదములందు లలిత భావముంచి
సరస హృదయులకును సంతోషమును ఁగూర్తు
భవ్య సుగుణశీల భరతబాల.

4. ఆంజనేయ శతక మాటవెలదులందుఁ
గూర్చితి మునుముందు కోర్కెతోను
సత్యసాయి శతిని సమకూర్చితిని వెన్క
భవ్య సుగుణశీల భరతబాల.

5. విశ్వమందుఁగనిన వినిన వింతలు కొన్ని
విన్నవించుకొందు వినయముునను
విమలమతులు వీటి విలువ గుర్తించరా?
భవ్య సుగుణశీల భరతబాల.

6. స్వార్థగుణము పెరిగి సాటి మానవులకు
హాని చేయదలచి రవని జనులు
తాను చెడిన కోతి వనమెల్ల చెఱచదా?
భవ్య సుగుణశీల భరతబాల.

7. పదవుల పయి మోహమధికముగా హెచ్చి
ఎదటివారి మదికి సొదను గూర్చు
చల్ది దిన్న మగడు సతియాక లెఱుగునా?
భవ్య సుగుణశీల భరతబాల.

8. గుణగరిష్ఠులైన కోవిదులెందరో
అన్నవస్త్రములకు నలమటింప
అల్పమతులు నేడు - అందలాలెక్కిరి
భవ్య సుగుణశీల భరతబాల.

9. అల్ప బుద్ధి వాని నందల మెక్కించ
ఉత్తములను దాని నెత్తుమనును
మొఱటు వాడెఱుగునె మొగలి పూవాసన
భవ్య సుగుణశీల భరతబాల.

10. మధుర ఫలములొసగు మామిడి చెట్టుకే
తగులు ఱాతిదెబ్బ ధరణియందు
మంచివారికెపుడు వంచన తప్పదు
భవ్య సుగుణశీల భరతబాల.





11. కులపు దురదబుట్టి కొందరు పెద్దలు
గోకికొనుచు నుండ్రు ఘోరముగను
ఎవరి వెఱ్ఱి వారికెంత యానందమో!
భవ్య సుగుణశీల భరతబాల.

12. చదువులెన్ని జదివి శాస్త్రార్థమెఱిగియు
కులము కంపు వదలరేల బుధులు
మొగలి పొదల పొంత నాగములున్నట్లు
భవ్య సుగుణశీల భరతబాల.

13. అగ్రకులమునందు నవతరించిన జాలు
గౌరవము లభించు నుర్వియందు
మతి సురగురువైన నితరునికబ్బదు !
భవ్య సుగుణశీల భరతబాల.

14. స్వస్తి వాక్యములను చక్కగ బలికెడి
ఆర్యులెల్ల దాని యర్థమెఱిగి
పుడమి సేమమునకు బూనుకోరేలకో!
భవ్య సుగుణశీల భరతబాల.

15. జగతి మేలు గోరు జగదీశులీధరన్
స్వార్థచింత వలన పతనమైరి
కల్పవృక్షమింటి కట్టెలైనట్టులు
భవ్య సుగుణశీల భరతబాల.

16. వేదశాస్త్రములను విపులముగా నేర్చి
పండితులని ఖ్యాతి వడసి కొంద
రర్థ లోభమునను వ్యర్థులైపోయిరి
భవ్య సుగుణశీల భరతబాల.

17. కరతలమున భిక్ష తరుతలమున నిద్ర
చాలు ననుచు (బలికె శంకరుండు
వారి వాక్కులెవరు పాటింతురీ భువి
భవ్య సుగుణశీల భరతబాల.

18. సమసమాజ స్థాపనము సేతుమని కొంద
రఱతురు గళమెత్తి యతిశయమున
తమవరకును రాగ తప్పించుకొందురు
భవ్య సుగుణశీల భరతబాల.

19. అంటరానితనము - అతి దోషమనుచును
ఆరగింప వెరతు రతనితోను
అతి విచిత్రము గద యవని జనుల తీరు
భవ్య సుగుణశీల భరతబాల.

20. అగ్రకులజులనియు నంత్య వర్ణజులని
భేదభావమేల విబుధులకును
దేహమందు వెలుగు దివ్యాత్మకులమేది?
భవ్య సుగుణశీల భరతబాల.





21. మట్టికుండ వంటి మానవ దేహమున్
నమ్మి మానవుండు నాశమౌను!
ఎట్టులైన తనువు కట్టెల పాలౌను
భవ్య సుగుణశీల భరతబాల.

22. బ్రతికినంతమేర బ్రతుకమీ జగతిని
బ్రతికియుండినపుడ పరుని (గనుడి
దీపముండగానె దిద్దుకొనుడు యిల్లు
భవ్య సుగుణశీల భరతబాల.

23. వత్సరాదినాడు భక్ష్యాలు వండగ(
బూని పంచదార తేనుబోగ
సేల్సుటాక్సు పెరిగి చేదయ్యె చక్కెర
భవ్య సుగుణశీల భరతబాల.

24. విపణివీధియందు బియ్యము ధర పెంచ
సాదమునకు (గుందె సగటు మనిషి
నల్ల వర్తకములు పెల్లుగా సాగెను
భవ్య సుగుణశీల భరతబాల.

25. ప్రాలయందు కలితి పాలలోపల కల్తి
పప్పునందు కల్తి యుప్పు కల్తి
తేనెయందు కల్తి నూనెలోపల కల్తి
భవ్య సుగుణశీల భరతబాల.

26. కనకమందు కల్తి ఖండచక్కెర కల్తి
మిరపపొడి కలితి సిమెంటు కలితి
అన్నమునను కల్తి యౌషధములు కల్తి
భవ్య సుగుణశీల భరతబాల.

27. భాషయందు కలితి భావములో కల్తి
బ్రతుకులందు కలితి వ్రతము కల్తి
కలితి లేని తావు కలియుగమున లేదు
భవ్య సుగుణశీల భరతబాల.

28. జనుల మోసగించి ధనము సంపాదించి
తానుఁగుడువ బోక దాచిపెట్టు
తేనె పెరనుబెట్టు తేనెటీగల వోలె
భవ్య సుగుణశీల భరతబాల.

29. వాని తలనుఁగొట్టి వీని నెత్తినిఁగొట్టి
కూడఁబెట్టు ధనము కూర్మితోను
నక్క లెల్లవేళ బొక్కలు వెదకవా!
భవ్య సుగుణశీల భరతబాల.

30. పెద్ద పెద్ద మేడ మిద్దెలు వెలసెను
చూడ-నగరమందు చోద్యముగను
అల - కుబేరుని పురమవనికి దిగెనేమో !
భవ్య సుగుణశీల భరతబాల.





31. పరుల సొమ్ముదోచు పాపాత్ములీనాడు
అధికమైరి లోకమందు ఁజూడ
ధర్మడెట్లు వారి దయఁజూచునోమరి!
భవ్య సుగుణశీల భరతబాల.

32. ప్రజల సేమమునకు పదకాలు ప్రకటించి
నిధి విడుదల చేసి 'నీటు' గాను
కోట్ల డబ్బు మ్రింగి - ఓట్లకు వత్తురు
భవ్య సుగుణశీల భరతబాల.

33. విశ్వమందు పెద్ద బిచ్చగాళ్లెవరన్న
ఓట్ల బిచ్చగాళ్లె - ఉర్వియందు
హాస్యమునకుఁగాదు - అసలు నిజము సుమ్మ
భవ్య సుగుణశీల భరతబాల.

34. ప్రజల ఎదుటఁజేరి వాగ్దానములు చేసి
కరములు ముకుళించి కాళ్లు మ్రొక్కి
నోట్లు పంచిపెట్టి - ఓట్లను యాచింత్రు
భవ్య సుగుణశీల భరతబాల.

35. ఉత్తమాటలయ్యె నుత్తరు ప్రజ్ఞలు
ప్రజల ముందు 'నేత' ప్రతినచూడ
ఓట్ల కొఱకు పడని పాట్లేమి యుండును!
భవ్య సుగుణశీల భరతబాల.

36. త్రాగునీటి కొఱకు తపియించు చుండిరి
భాగ్యనగర ప్రజ లభాగ్యులయ్యి
నేతల పదకాలు నింగిపూలయ్యెను
భవ్య సుగుణశీల భరతబాల.

37. 'పార్టి' లెన్నిమారి ప్రభువులు మారినా
జనుల బ్రతుకులందు (గనము మార్పు
'జగ్గు' మారుగాని సారాయి మారదు
భవ్య సుగుణశీల భరతబాల.

38. జాతి సుఖము(గోరు నేతలు కఱవైరి
స్వార్థపరులు నేడు జగతి నిండ
రాజకీయమెంత రట్టడైపోయెను
భవ్య సుగుణశీల భరతబాల.

39. వర్ణ, వర్గ, ప్రాంత, భాషలాచారాలు,
కుల మతాల పేర - కూల్చి జాతి,
దేశ వైభవమును నాశమొనర్చిరి
భవ్య సుగుణశీల భరతబాల.

40. శాసనసభలందు జగడము లాడుచు
'మైకు' విరుగ(గొట్టు మాన్య సభ్యు
లెట్లు ప్రజల మేలు నికను వాంఛింతురో!
భవ్య సుగుణశీల భరతబాల.





41. శేషనొక్కడేమి సేయు సంస్కరణలు
పౌరుల మనములను మార్పులేక
జనులు మారకున్న సంస్కృతి మారునా?
భవ్య సుగుణశీల భరతబాల.

42. దేశముననను మిగుల తీవ్రవాదము హెచ్చి
భంగమాయె శాంతిభద్రతలకు
పచ్చనైన యింట చిచ్చు రగిలినట్లు
భవ్య సుగుణశీల భరతబాల.

43. అనుదినమొక 'బస్సు' అగ్నికాహుతియయ్యె
నిత్యమొక్క మనిషి నేలకొఱగె
దినమొక 'ఎనుకౌంటరి'నుమడించెను గదా!
భవ్య సుగుణశీల భరతబాల.

44. ఆయుధములతోను హతులైరి కొందఱు
మందుపాతరలకు కొందరైరి
యెంతకాలమిట్లు 'హింస' రాజ్యమునేలు
భవ్య సుగుణశీల భరతబాల.

45. 'హత్య' చేయబడిరి - అధికారులెందరో
పట్టణముల యందు పల్లెలందు
రక్షకభటులకును రక్షణ కఱవయ్యె
భవ్య సుగుణశీల భరతబాల.

46. నగరపు నడిబొడ్డునందున నరహత్య
పట్టపగలు జరుగ ప్రజలకెట్లు
శాంతిభద్రతలిక నమకూరు ధరలోన
భవ్య సుగుణశీల భరతబాల.

47. బస్సులపయి రాళ్ల పడవేసి యద్దాలు
పగులఁగొట్టుచుండ్రు 'బందు'నాడు
ప్రజల - ఆస్తులిట్లు పాడుచేయుట మేల?
భవ్య సుగుణశీల భరతబాల.

48. బస్సులపయి రాళ్ల పడవేయ ఫలమేమి?
రైళ్ల గాల్చనేమి లాభమొదగు?
శాంతితోను లక్ష్యసాధన సేయరో!
భవ్య సుగుణశీల భరతబాల.

49. పేద గొప్ప యనెడి భేదభావము వీడి
చేతివ్రేళ్ల వోలె చేరి మెలగ
వసుధపైని సమయు వర్గపోరాటాలు
భవ్య సుగుణశీల భరతబాల.

50. భేదభావములను విస్మరించిననాడు
దేశమొక్కటయ్యి తేజరిల్లు
మింట మబ్బు తొలగ మిహిరుడు వెలుగడా?
భవ్య సుగుణశీల భరతబాల.





51. కాపు పొలము దున్ని కష్టించి పండించ
సాహుకారు గొనును చౌకధరకు
సొమ్ము ఒకనిదైన సోకు మరొకడిది
భవ్య సుగుణశీల భరతబాల.

52. వందల యెకరాల పంటభూముల దొరల్
సేద్యమించు కేని చేయకుండ
బీడు వెట్టి జనుల బీదలఁజేసిరి
భవ్య సుగుణశీల భరతబాల.

53. పల్లెటూళ్లయందు బ్రతుకుఁదెరువు లేక
పట్టణాలవైపు పనికి వెడలు
బక్క రైతు బ్రతుకు చక్కఁజేయు నెవడు?
భవ్య సుగుణశీల భరతబాల.

54. బాల కార్మికులను పనియందు నియమింప
వలదటనుచు ఁబలుక ఫలమదేమి?
కూడు గుడ్డలున్న కూలికెందుకు బోవు
భవ్య సుగుణశీల భరతబాల.

55. తినగ తిండిలేక తిప్పలు పడుచుండ
ప్రతిభ యెట్లు నిలుచు ప్రజల మతిని
వాడిన కుసుమాల వాసన నిల్చునా?
భవ్య సుగుణశీల భరతబాల.

56. ఇండ్లు లేనివారికిండ్లు గట్టించగ
నిట్టె కూలిపడియె కట్టునపుడె
చిత్తశుద్ధిలేని గుత్తదార్లుండగా
భవ్య సుగుణశీల భరతబాల.

57. చిత్తశుద్ధిఁగలిగి సేవ చేసిననాడు
వృద్ధిపొందు జాతి వింతకాదు
మనసు మంచిదైన మరియాద పెరుగదా!
భవ్య సుగుణశీల భరతబాల.

58. తిండి తీర్థములకు దేవురించెడివాడు
ప్రజల సేవకొరకు పనికిరాడు
త్యాగధనుడొకండె తగు జనసేవకు
భవ్య సుగుణశీల భరతబాల.

59. కన్నతల్లి నింత గౌరవించనివాడు
కన్నభూమినెట్లు గౌరవించు
ఉట్టి కందనయ్య - ఉడువీధి కందునా?
భవ్య సుగుణశీల భరతబాల.

60. ఈ ప్రభుత్వము మనయిక్కట్లుఁదీర్చదు
ఆశ వదలుకొనుడు - అనుజులార!
ఎండమావిని జలమెన్నాళ్లు వెదకేము?
భవ్య సుగుణశీల భరతబాల.





61. జీవితమున నెన్ని చెట్టలు వచ్చిన
విడువవలదు ధైర్య వృత్తినెపుడు
పిరికివాని లక్ష్మి వరియింప ఁజూచునే?
భవ్య సుగుణశీల భరతబాల.

62. భువిని మానవుండు పుట్టినది మొదలు
ననుభవించుచుండు నాపదలను
సుఖముఁగోరు కొనుచు శోకము పొందును
భవ్య సుగుణశీల భరతబాల.

63. పిండికొలది రొట్టె వెండి కొలది నగ
కలిగినంత ఁగుడుచు కర్మఫలము
పాత్ర మెంతదైన ఫలమంతియే కద!
భవ్య సుగుణశీల భరతబాల.

64. గొప్ప కొరకు మనుజులప్పులు సేయుచు
తిప్పలు వడుచుంద్రు తీర్చలేక
అప్పులేని వారలధిక సంపన్నులు
భవ్య సుగుణశీల భరతబాల.

65. కడుపునిండ తిండి కంటినిండ నిదుర
కరము నిండుగ పనిఁగలిగి యుండు
నతడె లోకమందు నారోగ్యవంతుడు
భవ్య సుగుణశీల భరతబాల.

66. ఆశలెక్కువైన నాపదలధికమౌ
నాసలేక మనుజులవని మనరు
ఆశ మరి నిరాశ లల్లుకొన్నదె బ్రతుకు
భవ్య సుగుణశీల భరతబాల.

67. ఎండమావులందు నెన్నాళ్ల వెదకిన
సుంతయేని జలము చూడబోము
ఇహ సుఖమ్ములన్ని యెండమావులె సుమీ!
భవ్య సుగుణశీల భరతబాల.

68. అతని 'జేబు'గొట్టి యామె 'పర్సు'ను గొట్టి
పట్టుపడిన వెనుక పరితపించు
చేయి గాలినంత చింతించి ఫలమేమి?
భవ్య సుగుణశీల భరతబాల.

69. 'మట్క' జూదమాడ మరగిరి కొందఱు
అర్థ కాంక్షచేత నవనియందు
వ్యసనములకు లొంగి పలువురు చెడలేద?
భవ్య సుగుణశీల భరతబాల.

70. లాటరీల కొరకు లక్షలు వెచ్చించు
భాగ్యలక్ష్మి యెపుడు వరములిడునొ?
అందని ఫలమునకు హస్తమెత్తిన యట్లు
భవ్య సుగుణశీల భరతబాల.





71. అశ్వరాజములకు నధిక ద్రవ్యమ్మును
ఖర్చు చేయుచుండు కాంక్షమీర
అశ్వయోగమతని కబ్బునో యబ్బదో?
భవ్య సుగుణశీల భరతబాల.

72. కవుల నాదరించి కావ్యాలు చెప్పించు
ఘనులకీ జగమున కఱవుగలదు
రాలు దొఱకు గాని రత్నాలు దొఱకునా!
భవ్య సుగుణశీల భరతబాల.

73. మద్యపానమునకు మరగి లోకులు మద
మత్తులై తిరుగుచు మహిని సతము
పడటఁగలిపిరి తమ పరువు ప్రతిష్ఠలు
భవ్య సుగుణశీల భరతబాల.

74. కల్లు ద్రావి యిల్లు గుల్లఁజేయగనేల?
త్రోవ నడచుచు కడుఁదూలనేల?
ఆలి పుస్తెలమ్మి యంగలార్చగనేల?
భవ్య సుగుణశీల భరతబాల.

75. 'సారా' ద్రాగువారి గౌరవమ్ము చెడును
ఉన్న సొమ్ములెల్ల నూడునయ్య!
కాయము చెడి కడకు కాటికేగుదురయ్య!
భవ్య సుగుణశీల భరతబాల.

76. ఆసుపత్రి కేగ నంటురోగములంటు
నలవిగాని వాసనలు భరించి
కోరి రోగములను కొని తెచ్చుకోనేల?
భవ్య సుగుణశీల భరతబాల.

77. ఆసుపత్రులందు నసువులతో చెల
గాట మాడుచుంద్రు వాటముగను
వైద్య శాలలిట్లు వధ్యశాలలునయ్యె
భవ్య సుగుణశీల భరతబాల.

78. బడికి (బోవునట్టి పసిపిల్లలను జూడ
నవిసిపోవు గుండె లెవరికైన
ఇంతలేసి బరువులెన్నాళ్లు మోయుట?
భవ్య సుగుణశీల భరతబాల.

79. కారులోన బోవు కలవాని కొమరుడు
కాలి నడకన జను కూలి కొడుకు
తల్లి భూమిఁగన్న తనయులే యిరువురు
భవ్య సుగుణశీల భరతబాల.

80. ఆంగ్ల విద్యపట్ల నధికమయ్యెను మోజు
మాతృభాషపైని మమత లుడిగె
పొరుగు కొంపలోని పుల్లగూరయె రుచి
భవ్య సుగుణశీల భరతబాల.





81. భారతీయ విద్య బాగుండునందురు
దానివలన జాతి దనరు నంద్రు
కాని, తన కొడుకగు కాన్వెంటు స్టూడెంటు!
భవ్య సుగుణశీల భరతబాల.

82. పాఠశాలలందు 'సీటు' కొరకు నేగ
వేల డబ్బులట విరాళమడుగ
చదువు లీయుగమున సంతసరకులయ్యె!
భవ్య సుగుణశీల భరతబాల.

83. చదువు కొనుమటనుచు సతతము పలికిన
పొత్త మొక్కమారు ముట్టఁబోడు
శ్రద్ధలేని ఛాత్రుఁజదివింప నెట్లగు?
భవ్య సుగుణశీల భరతబాల.

84. 'క్లాసు'ల నెగగొట్టి 'కాలేజి'లకు (బోక
చదువుమాని వారు చవటలైరి
ఛాత్రులిట్టులుండ సంఘమెట్టుల నుండు?
భవ్య సుగుణశీల భరతబాల.

85. కన - పరీక్షలందు 'కాపీ'లు గొట్టుచు
పట్టువడి పిదప 'డిబారు' నయ్యు
రోడ్లపైన (దిరుగు రోమియో రీతిగ
భవ్య సుగుణశీల భరతబాల.

86. 'బస్సు స్టాపు' లందు బాలికలను జూచి
ఈలవేసి మిగుల గోలచేసి
ఆడుపిల్లల కడు నేడిపింతురు గదా!
భవ్య సుగుణశీల భరతబాల.

87. 'లైబ్రరీ'కిఁ బోయి 'ర్యాకు'ల సందుల
రాగదృష్టిఁ బఱపు రమణిపైకి
లైబ్రరీలు యిట్లు 'లవ్వు సెంటరు'లాయె
భవ్య సుగుణశీల భరతబాల.

88. కన్నె కంటఁబడిన కనుసైగ చేయుచు
వెంటనంటిఁ దిరుగు వెఱ్ఱివారు
చదువులెట్లుఁ జదివి సఫలులగుదురయ్య!
భవ్య సుగుణశీల భరతబాల.

89. పైరవీలు చేసి పైకము లర్పించి
'సర్టిఫికటు'లఁగొను ఛాత్రవరులు
సమసమాజమెట్లు స్థాపింతురో మరి!
భవ్య సుగుణశీల భరతబాల.

90. పెద్ద చదువులకయి విశ్వవిద్యాలయ
ప్రాంగణములలోను ప్రాకులాడి
పట్టములను బొందు పాధికై పరుగెత్తు
భవ్య సుగుణశీల భరతబాల.





91. చదువు లక్ష్యమెంత సన్నమై పోయెను
భౌతిక సుఖములఁకు పరిమితమయి
చదువు సారమెఱుగఁ జదువుకోరెలకో
భవ్య సుగుణశీల భరతబాల.

92. రాజకీయములకు రమ్యమౌ నిలయము
యూనివర్సిటొక్కటేను నిజము
అఖిల జనుల కదియె ఆశ్రిత వృక్షము
భవ్య సుగుణశీల భరతబాల.

93. యూనివర్సిటీలు 'ఖూని' వర్సిటిలయ్యె
'రౌడి' మూకలచట రాజ్యమేల
కజ్జికుక్కలెల్ల కపిలధేనువులౌనె!
భవ్య సుగుణశీల భరతబాల.

94. కులము పిచ్చిపట్టి కొందరధ్యాపకుల్
చదువుల విలువలను పదటఁగలిపి
స్వకుల సంఘములను స్థాపించుచుండిరి
భవ్య సుగుణశీల భరతబాల.

95. బంధుప్రీతిఁదవిలి కొందరాచార్యులు
మూల్యములను వార్ధిముంచిరయ్య!
కనులుఁ బోవువరకు కాటుకఁబెడుదురే!
భవ్య సుగుణశీల భరతబాల.

96. జ్ఞానదృష్టినిచ్చి కరుణతో (జూచిన
గౌరవించవలయు గురువులనుచు
పీఠమెక్కిన ప్రతి వెధవ యొజ్జగునయ్య!
భవ్య సుగుణశీల భరతబాల.

97. విద్య నేర్పిన గురువెంత కుటిలుడైన
గురువుగాను నతని(గొలువ వలయు
'ఎఱుకు' వ్రేలినిచ్చి యెంతటి ఘనుడయ్యె
భవ్య సుగుణశీల భరతబాల.

98. వసుధయందు విద్య వ్యాపారమయ్యెను
ఆటబొమ్మయయ్యె నతివ నేడు
నైతిక విలువలను నాశనమై పోయె
భవ్య సుగుణశీల భరతబాల.

99. అధికమయ్యె నేడు - అందాల పోటీలు
కాసుకు వనితలును దాసులైరి
అతివ లోకమందు నంగడిబొమ్మయ్యె
భవ్య సుగుణశీల భరతబాల.

100. నటన పేర సన్ననైన వస్త్రము గట్టి
మేని సొగసులెల్ల(గానుపించ
వెండి తెరలపైన వెలిగిరి తారలు
భవ్య సుగుణశీల భరతబాల.





101. చిత్రజగతిలోని స్త్రీల వర్తనములు
చెప్పనలవి యగునె శేషునకును
ఎంచబోవ మంచమెల్ల (గంతలెకదా!
భవ్య సుగుణశీల భరతబాల.

102. నల్ల ఫిలిములందు నుల్లము రంజిల్ల
నగ్న తారల(గను నరుడు ప్రీతి
ఘోణులెపుడు బుఱద గుంటలు వెదకవా!
భవ్య సుగుణశీల భరతబాల.

103. అమ్మవోలె వనిత నాదరించని జాతి
వృద్ధి పొందగలదె యిద్ధరిత్రి
జనని - జన్మభూమి స్వర్గమునకు మిన్న
భవ్య సుగుణశీల భరతబాల.

104. ఆడువారి నెవ్వడవమాన పఱచునో
వాడు లోకమునను వాసిగనడు
తల్లి కన్న వేరు దైవతముండునే!
భవ్య సుగుణశీల భరతబాల.

105. శాస్త్రవిద్యలెల్ల సాకల్యముగ నేర్చి
సృష్టికి ప్రతిసృష్టి చేసె మనిషి
కాని, మానవత్వమును కాలరాచెను
భవ్య సుగుణశీల భరతబాల.

106. అణుపరీక్షలందు నభివృద్ధి సాధించి
మారణాయుధము తయారుచేసి
నర వినాశమునకు నరుడు కారణుడయ్యె
భవ్య సుగుణశీల భరతబాల.

107. అంతరిక్షయాన మధికము గావించి
గగనతలముపైకి గ్రహములంపి
చంద్ర బుధులపైని చరియించె మనుజుడు
భవ్య సుగుణశీల భరతబాల.

108. ఎంతటి ఘనకార్యమిట్టె సాధింతని
హుంకరించె నరుడహంకరించి
దైవ దూషణకును తలపడె న్యాయమా?
భవ్య సుగుణశీల భరతబాల.

109. దైవబలములేక ధరణిలోనేపని
జరుగఁబోదు యుక్తిశక్తులున్న
శివుని యాజ్ఞలేక చీమైన కుట్టునా?
భవ్య సుగుణశీల భరతబాల.

110. ప్రతిభ గలిగినంత పదవులు దొరకవు
పైరవీలు సేయ పదవులబ్బు
మిసిమికి నిసుమంత మెఱుగు నద్దినయట్లు
భవ్య సుగుణశీల భరతబాల.





111. కన-ప్రభుత్వపు ఘనకార్యాలయములందు
పైరవీల జోరు పెరిగిపోయె
లంచము దినమరగి మంచాలు వేతురు
భవ్య సుగుణశీల భరతబాల.

112. లంచమీయకున్న లచ్చిమగండైన
వరము లీయఁబోడు భక్తులకును
కాసుకున్న శక్తి కాసుకే తెలియును
భవ్య సుగుణశీల భరతబాల.

113. 'మస్క' గొట్టకుండ మనవాడు గాలేడు
'కాక' బట్టకుండ కాడు ఘనుడు
'చెంచ' గిరిని చేయ చేకూరు సర్వము
భవ్య సుగుణశీల భరతబాల.

114. సభలముందుఁజేరి చప్పట్లు చఱచుచు
ఆహా! ఓహో! యనుచు నల్పమతులు
అయ్యవారల కృపనంతంత గెలుతురు
భవ్య సుగుణశీల భరతబాల.

115. ఎప్పుడు తమ గొప్ప చెప్పికొనెడివారు
గొప్పవారుగ ధర నొప్పిరయ్య!
వెలితిపాత్ర లెల్లవేళల మ్రోయవా!
భవ్య సుగుణశీల భరతబాల.

116. విద్య లేనివాడు వేధఁదిట్టగరాదు
విత్తమున్నచాలు విశ్వనుతుడు
కలియుగమ్మునందు కాసుకు విలువెచ్చు
భవ్య సుగుణశీల భరతబాల.

117. భాగ్యవంతునింట బాడుగకుండుట
పనికిరాదు పేదవారికెపుడు
కాలనాగు నోట కప్పలు వడ్డట్లు
భవ్య సుగుణశీల భరతబాల.

118. పలుకఁబూనినట్టి భావము సూటిగా
హృదయమునకు చేరు రీతిఁబలికి
పాఠకుల మనమ్ము బాధపెట్టితినేమొ!
భవ్య సుగుణశీల భరతబాల.

119. ఎవరి మనమునైన నెరియించుటకు ఁగాదు
లోకరీతి ఁదెలుపు వీఁకతోను
చెప్పితీ శతకము స్వీకరించుము కేల
భవ్య సుగుణశీల భరతబాల.

120. ఆంజనేయరాజు - ఆటవెలదులందు
చెప్పినట్టిమాట చెవినిబెట్టి
దానవత్వమణచి మానవత్వము పెంచు
భవ్య సుగుణశీల భరతబాల.